# స్వప్నలబ్ధాద్వైతబోధ.



## 2వ భాగము.



## భక్తి.



# విషయసూచిక.



## రెండవభాగము.



ఓం

శ్రీగురుభ్యోనమః

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# 2వ భాగము

## భక్తి.

శ్లో॥ "భక్తిరేవ పరమార్థదాయనీ భక్తిరేవ భవరోగనాశినీ,
భక్తిరేవ పరవేదన ప్రదాభక్తిరేవ పరముక్తికారిణీ."

శ్లో॥ విసినా విధినావాపి భక్తాయే మాముపాసతే । తేభ్యః
ఫలం ప్రయచ్ఛామి ప్రసన్నోహం నశంసయః." శివగీతలు.

భక్తియనగ నత్యంత స్నేహపూర్వక ప్రేమ.

ఇది నిరంతర దైవ నామోచ్చారణ, సజ్జన సేవవలన లభించును. మనోబుద్ధి చిత్తాహంకారములు పవిత్ర (నిర్మల)ములై యుండవలయును. కాని మనుజుఁడవిద్య (అజ్ఞానము)లో బుట్టుటచేతఁ (గీతల 3 అ. 5 శ్లో.) బ్రకృతి గుణములకు లోనై యవశముగఁ బ్రతిక్షణముచేయుఁ గర్మలకుఁ (గీ. 3 అ. 27 శ్లో.) దాను కర్తనని రాగద్వేషములు (గీ. 3 అ. 34 శ్లో.) కలిగియుండుఁగావున, మనోబుద్ధి చిత్తాహంకారములు నిర్మలతపోయి, యపవిత్రములగుచున్నవి. ఇవి పవిత్రమగుటకు యజుర్వేదములోఁ జెప్పిన ప్రార్థనా మంత్ర

ములను నిత్యాభ్యాసముకొరకు నిచట వ్రాయుచున్నాను.

1. చిత్పతిర్మాపునాతు. వాక్పతిర్మాపునాతు. దేవోమాస వితా పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోసూర్యస్యరశ్మిభిస్తస్యతే పవిత్రపతే. పవిత్రేణ యస్మైకంపునే తచ్ఛకేయం ”

2. పునంతు మాదేవజనాః. పునంతు మనవోధియా. పునంతు విశ్వాఆయవః. జాతవేదః పవిత్రవత్ పవిత్రేణపునాహిమా.

3. అద్భిర్గాత్రాణి శుధ్యంతి. మనస్సత్యేన శుధ్యతి. విద్యాత పోభ్యాం భూతాత్మా బుద్ధిర్జ్ఞానేన శుధ్యతి.

అర్థము.

1. చిత్పతిః—మనోభిమానిదేవతా (పరమ పురుషుఁడు) మా—నన్ను. పునాతు—పవిత్రముచేయుగాత. వాక్పతిః—బృహస్పతి (వాగధిదేవుఁడు) మా—నన్ను. పునాతు—పవిత్రముచేయుగాత. సవితాదేవః—సూర్యుఁడు. మా—నన్ను. పునాతు—పవిత్రముచేయుగాత. అచ్ఛిద్రేణ—ఛిద్రములేనట్టి. పవిత్రేణ—పవిత్రమైనట్టి. వసోః—జగన్నివాసహేతుభూతమైనట్టి. సూర్యస్యరశ్మిభిః—సూర్యకిరణములచేత. మా—నన్ను. పునాతు—పవిత్రముచేయుగాత. ।హే। పవిత్రపతే—పవిత్రముచేయు ఓస్వామి. తస్యతే—పైనజెప్పిన నీయొక్క. పవిత్రేణ—పవిత్రములైన కిరణములచేత. యస్మై—యేకర్మకొరకు. కం—ఆత్మను. పునే—పవిత్రమైనదిగాఁ జేయుచున్నావో. తత్—ఆకర్మనుగురించి. శకేయం—సమర్థుఁడైనవాఁడనగుదుగాక.

## తాత్పర్యము.

కిరణములచేత దినకరుఁడు తమస్సును బారదోలి వెల్గుచునో నగురీతి, పరమపురుషా! అజ్ఞానవశతను రాగద్వేషములతోఁ బ్రతి క్షణము నేనొనర్చు కర్మలందు, కర్తనను భ్రాంతిని నశింపుచేసి, నాదు మనోవాక్కర్మల నీకర్పణచేయు బుద్ధినొసగి నన్ను పునీతుని జేయుము భక్తవత్సలతను.

2. దేవజనాః—దేవతులు. మా—నన్నును. పునాతు—పవిత్రమైన వానిగాఁ జేయుగాక. మనవః—మనువులు. ధియా—బుద్ధిచేతను. మా—నన్ను. పునాతు—పవిత్రమైన వానిగాఁ జేయుదురుగాత. విశ్వ ఆయవః—విశ్వేదేవతలు. మా—నన్ను. పునాతు—పవిత్రమైనవానిగాఁ జేయుగాత. హేజాతవేదః—ఓ అగ్ని దేవుఁడా. పవిత్రవత్—పవిత్రమైన నీవు. పవిత్రేణ—కిరణములచేత. మా—నన్నును. పునాహి—పవిత్రమైనవానిగాఁ జేయుమా.

## తాత్పర్యము.

దేవతలు దేహేంద్రియంబులను, మనువులు బుద్ధిని, విశ్వేదేవులు పవిత్రాగ్ని సర్వవిధముల నన్ను పవిత్రుని జేయుగాత.

3. అద్భిః—ఉదకములచేత. గాత్రాణి—యింద్రియములు, శుధ్యంతి—పరిశుద్ధములగుచున్నవి. సత్యేన—సత్యమైన వాక్కుచేత. మనః—అంతఃకరణము. శుధ్యతి—పరిశుభ్రమగుచున్నది. విద్యాతపోభ్యాం—విద్యాతపస్సులచేత. భూతాత్మా—అంతరాత్మ. శుధ్యతి—పరిశుద్ధమగుచున్నది. జ్ఞానేన—యథార్థజ్ఞానముచేత. బుద్ధిః—బుద్ధి. శుధ్యతి—పరిశుద్ధమగుచున్నది.

జ్ఞానమనగా పదార్థములయొక్క సహజస్థితిని స్వరూపమును తెలుపునట్టి శక్తి. ఇట్టి స్థితి, స్వరూపములయొక్క మంచిచెడ్డలును నిర్ణయించునట్టి శక్తి విశిష్టమైన యంతఃకరణముబుద్ధిగాన, పదార్థములయొక్క యదార్థపరిజ్ఞానముచే బుద్ధి శుద్ధి యగును. అయితే గీతలయొక్క 7 అ. 11 శ్లోకములో శ్రీకృష్ణస్వామి చెప్పిన "ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి" యను వాక్యమునుబట్టి ధర్మవిరుద్ధములుకాని కోర్కెలు బ్రహ్మస్వరూపములగుటవలన, వీని యదార్థజ్ఞానముచే బుద్ధి పవిత్రమగునని చెప్పఁబడినది. ఇతరములైన కోర్కెలు అనగా ధర్మవిరుద్ధములైన కోర్కెలు మలినవృత్తులు, మలినవాసనలగుటవలన త్యజింపఁదగినవి. అట్టి వాసనల వృత్తులయొక్క త్యాగమే మనోనశ్యమని చెప్పఁబడును.

తాత్పర్యము:—శరీరేంద్రియముల నుదకములు, మనస్సును సత్యము, అంతరాత్మను విద్యాతపస్సులు, బుద్ధిని జ్ఞానము పవిత్రముచేయును.





ఓం

శ్రీగురుభ్యోనమః.

# పీఠిక.

ది 29—10—28 విభవసంవత్సరాశ్వీయుజ బహుళపాడ్యమి సోమవారమురాత్రి రెండు ఝాములు దాటినవెనుక రమారమి 14 సంవత్సరములు వయస్సు, నల్లని దేహకాంతిగలిగి భుజముల యందు బంగారు నగలను, కుడిహస్తమందు బెత్తమును, పీతాంబరములను ధరించిన నొక బాలుఁడు స్వప్నములోఁ గనుపించెను. నేనుచూచి మీరెవరని యడుగగా, „నీకాయుర్దాయము వృద్ధిచేయ వచ్చినానని" చెప్పెను. „మీరెవరు? నాకాయుర్దాయము వృద్ధిచేయఁగారణమేమి? ఎంతవరకు వృద్ధిచేయుదురని" నేను ప్రశ్నచేసినాను. వెంటనే మెలకువవచ్చి కాలోచితములకు వెలుపలకు వెళ్లవలసివచ్చినది. అవి నివృత్తిచేసుకొని తిరిగి పరుండి పై ప్రశ్నలకుఁ బ్రత్యుత్తరముకొరకుఁ బ్రార్థించి నిద్రించినాను. తిరుగ స్వరూపదర్శనము కాలేదు కాని నేనింకనుఁ గొన్నిపనులు చేయవలసియున్నందున నా యాయుర్దాయము వృద్ధిచేయఁబడినదని స్వప్నముకలిగినది. ఆపనులుయేవో, యెంతకాలమాయుర్దాయము వృద్ధి చేయబడినదో చెప్పలేదు.

పిదప 5-6 రోజులకు స్వప్నోపదేశమంత్రముల కక్షురహంసలు వ్రాయవలెనని బుద్ధిపుట్టి కొన్ని వ్రాసినాను. ది 12-11-23 తేదిరాత్రి 1 ఘంటకు నిద్రమెలకువవచ్చి తిరిగి వ్రాయుటకుఁ బ్రారం

భించఁగా నీ క్రిందవివరించిన మూడు పద్యములు “ శ్రీరామమంత్రమే మంత్రము ” అను పెద్ద కీర్తన వ్రాసితిని. నేనది వరకెన్నడు పద్యములు కీర్తనలు వ్రాయలేదు. ఇదే ప్రారంభము. తదుపరి క్రమముగా నన్ని స్వప్నములకు ముక్తసరుగ తాత్పర్యము మరి కొన్ని కీర్తనలు వ్రాసినాను.

పద్యములు.

1. నినుఁసేవింపనిమనుజుఁడు నిక్కముగ నిలలో ద్విపాదపశువనబరగున్, ధరలోఁ బుట్టి పెరిగిన లాభమినుమంతైనఁ బొందజాలడుజూవే.

2. రామతారకమంత్రము మోక్షమునకు రాజిలుచుండ, దానివదలి బ్రతుకుటకంటె నీచమెద్ది. ఇకనైన జీవితము వ్యర్థపుచ్చకఁ జేయుదు రామోపాసన సంసారతరణంబునకును.

3. క్రిందను మీఁదనేడేసి లోకము లమరియున్న నీజగతిలోన, దైవభక్తిలేని నావంటి వ్యర్థుఁడుండుట యరుదుగాన, నిటమీఁదనైన తెలివినొంది చేసెద శ్రీరామభక్తి సర్వకాల సర్వావస్థలయందు.

కీర్తన—కల్యాణరాగము—ఏకతాళము.

శ్రీరామమంత్రమే మంత్రము—పల్లవి.

1. సచ్చిదానంద స్వరూపమె శ్రీరామమంత్రము.
2. మనుజునకు ముక్తిసాధనమె శ్రీరామమంత్రము.
3. ఋషిగణంబులభ్యసించినదే శ్రీరామమంత్రము.

4. లంబికాయోగసాధనమే శ్రీరామమంత్రము.

5. నేడునాడను వివక్షతలేక జపించవలయునదే శ్రీరామ మంత్రము.

6. కలకాలమభ్యసింపఁదగినదే శ్రీరామమంత్రము.

7. ముల్లోకములందు సేవింపఁదగినదే శ్రీరామమంత్రము.

8. చేతనులకుఁ బ్రాణపదమే శ్రీరామమంత్రము.

9. సిద్ధులకు మూఢులకుఁ గూడ ముక్తినొసగునదే శ్రీరామ మంత్రము.

10. చూచునది చూడఁబడునది, విన్నది వినఁబడునది సర్వము శ్రీరామమంత్రము.

11. మందుఁడు మరి యమందుఁడు గూడ భజనచేయఁదగి నదే శ్రీరామమంత్రము.

12. మనోబుద్ధుల పంచజ్ఞానేంద్రియముల నేకముగ జూచుఁ టయే శ్రీరామమంత్రము.

13. నన్ను నిన్ను నేను నీవను ద్వైతబుద్ధి విడిచి చేయదఁగి నదే శ్రీరామమంత్రము.

14. మలినమనస్సును సదా నిర్మలము చేయునదే శ్రీరామ మంత్రము.

15. నియమిత కాలవేషభాషలులేక స్మరింపదగినదే శ్రీరామ మంత్రము.

16. లుప్తా? లుప్తములు, విధినిషేధములవిడిచి నిరతము భజింపఁదగినదే శ్రీరామమంత్రము.

17. మనస్సు నిలుచుచున్నది, లేదని విచారణలేక జపించవలసినదే శ్రీరామమంత్రము.

18. భక్తునియెడ కన్నతల్లికంటెం బ్రేమచూపునదే శ్రీరామమంత్రము.

19. దివ్యజ్ఞానమొసగునదే శ్రీరామమంత్రము.

ఈ రామకీర్తన నెవరుగాని సభలోన లేక సంఘములోనం బాడినవారికి విన్నవారికినిం గలుగు ఫలము నిస్సంశయముగనూ.

పిమ్మట వరుసగ 5-6 రాత్రులలో శతకము వ్రాసితిని, గాని గ్రంథాదియందుం జేయవలసిన విఘ్నేశ్వరాది దేవుల, గురువులయొక్కయు, ప్రాచీనకవులయొక్కయు ప్రార్థనలు వ్రాయబడలేదు. వీనిని వ్రాయవలెనని రెండు దినములు యత్నించినను, కుదరలేదు. మూడవదినము రాత్రి స్వప్నములో నొక గొప్ప సంతర్పణ ప్రదర్శనము కలిగినది. అందరు భోజనము ప్రారంభించినారు. నేను ఆచమనముచేసి, కేశవాదినామోచ్చారణచేయుటచే కించిదాలస్యమైనది. నా యెదర వీరభద్రయ్యయను బంధువుండు కూర్చొని, నేను పరిషించువరకుం గనిపెట్టి యుండెను. కేశవాదినామములు పూర్తిగ చెప్పి నేను పరిషించుటలో "సత్యంత్వర్తేన అమృతమస్తు" యను శబ్దముల వచించుచు, నుదకములోపలకు గ్రహించు తరుణములో మెలకువవచ్చినది. ఈస్వప్నకారణమేమని యోచించి వెంటనే లేచి వ్రాయనారంభించగా నీక్రింద శతకోపన్యాసములో వివరించిన విఘ్నేశ్వర వీరభద్రులప్రార్థనయు, యితర దేవుల, గురువుల, ప్రాచీన కవుల ప్రార్థనలు "సత్యం త్వర్తేన అమృతమస్తు" యనుశబ్దము

లతోఁ బ్రారంభమై యతి శీఘ్రముగా నాలుగు వాక్యములు వ్రాయ గలిగితిని.

తిరిగి రెండుదినములకు రాత్రి స్వప్నములో నేను నివశించు గృహామునకు లోపలను వెలుపల నసంఖ్యాకములగు కోతులు గంతులు వేయుచుఁ గనుపించిన తరువాత మెలకువవచ్చినది. పైనజెప్పిన నాలుగు వాక్యములలో నాంజనేయ స్తవము లేనందున నిటుల గనుపించినవని తలచి, వెంటనే హనుమంతుని గూర్చి ఐదవవాక్యము వ్రాసితిని.

ఇటుల నీ గ్రంథము దైవప్రేరణచే వ్రాయబడినదిగాని, నా పాండిత్యపు శేషముచేఁ గాదు. దీనిలో గణయతి ప్రాసలు ఛందశ్శాస్త్రకట్టుబాట్లు లేవు. వంకరలవలన చెరకుతీపి తగ్గని కారణమున, గణయతిప్రాసలు గమనింపక, విషయమునే గమనించి గ్రంథము పవిత్రమైనదిగాఁ జదువరులెంచఁగోరెదను.







ఓం

శ్రీమహేశాయనమః

శ్రీవేదవ్యాసాయనమః

శ్రీగురుభ్యోనమః

# శ్రీపరమేశ్వర శతకోపన్యాసము.



ఓ పరమేశ్వరా! జీవసృష్టియందపారకరుణచే నింద్రియ నియామకుఁడవై హృషీకేశనామము నొందితివిగాన, నాదు చపల చిత్తమనోబుద్ధుల నిగ్రహించి నిరతము నిండు భక్తిని నీచింతనము నర్పవరమొసంగుము భూతదయేశా.

1. „సత్యంత్వర్తేన, అమృతమస్తు*” యను వేదవచనముల న్యాయమున, సముద్దేశములతోఁ జేయనారంభించు కార్యములను విఘ్నములనుంచి కాపాడు శ్రీ విఘ్నేశ్వర వీరభద్రులకు, మరి యితరదేవులకు నమస్కారమొనరింతు గ్రంథప్రారంభమున, నది యమృతమై వెలయుఁగోరెదఁ.

2. నాకు స్వప్నములలో బ్రహ్మజ్ఞానోపదేశము చేసిన సచ్చి దానంద రూపులగు శ్రీ శంకరాచార్యాది గురుపరంపరలకు నమస్క రింతు సంపూర్ణవినయమునసూ.

3. ఆదికాలమున జ్ఞాన భక్తి వైరాగ్య మార్గముల బోధలు చేసిన సనకసనందాది బ్రహ్మమానస పుత్రులకు శ్రీ సుకవ్యాసనారదాది మునులకు, శ్రీ వసిష్ఠప్రభృతి ఋషులకుఁ బ్రాచీనకవులకుఁ బ్రణమిల్లుదు సద్భక్తి వినయములతోన.

4. విద్యా, జ్ఞాన, సంపదల కాస్పదమై, మరియొసగునట్టి శ్రీ సరస్వతీ, పార్వతీ, లక్ష్మీదేవతలకు, నితర శక్తులకు నమస్కరించెద సద్భక్తి యుక్తమునను.

5. శ్రీరామకార్యార్థ మంజనాగర్భమున వాయుపుత్రుఁడై జనించిన శివస్వరూపుఁడనన్యభక్తుఁడు, కార్యధురీణుఁడు, సీతాన్వేషణముకై లంకజొచ్చి ఘోరరాక్షసుల గర్వమణచి, పట్టణము కాల్చిన మహావీరుఁడు, బ్రహ్మచారి, సంపూర్ణజ్ఞాని, నవవ్యాకరణ పండితుఁడు, గానవిద్యావిశారదుఁడు, భక్తవత్సలుఁడైన హనుమంతున కర్పింతుఁ బెక్కు వందనములు నిండు భక్తితోడ నాకు మనఃస్థిరత.

---

* సత్యం—మానసిక యాదార్థ్యము.
తు—వ్యావర్తకము. మరియు
ఋతేన—వాచనిక యాదార్థ్యము
అమృతం—అత్యంతిక సుఖము. బ్రహ్మానందము.
అస్తు—అగుగాక.

తాత్పర్యము:- పవిత్రమైన మనోవాక్కరణములతోఁ జేయు కర్మ అత్యంతసుఖము—బ్రహ్మానందమగుగాత. వాక్సిద్ధికొరకు.

6. నిండు నిర్మల మనస్సుతో శ్రీ సీతారాముల సేవించినఁ గోర్కెలేక, ప్రాపించు సర్వార్థములు, మరి కోర్కెతో సేవించిన నది యొకటిమాత్రమె సిద్ధించునరయ.

సిమిపకవి వెంకయ్యయను స్వనామమునకు విలోమానులోమము ల అక్షరక్రమమున వ్రాసిన ప్రార్థన.

నిత్యనిరవద్య నిర్వికల్పబ్రహ్మము
మిథ్యారూపాధిష్ఠానము మరియు
షడ్గుణైశ్వర్య యుతముగాన
కనవలయును సర్వసాక్షిని
వికారశూన్యుని భక్తవత్సలుని
వెంకటేశ్వరనామమున
కంజదళాక్షు గుణాతీతు దేవదేవుని
యమనియమాదుల యభ్యాసముననూ

యజ్ఞతపోదానములు కర్మమార్గము
కలదు పునర్జన్మ వీని యభ్యాసముననను
వెంకటేశనామము దురితదూరము, ముక్తిదాయకముగాన
విడువవలదు క్షణమైన వాని నామస్మరణ శ్రవణమును మరి
కమనీయ పాదపద్మములఁ పూజార్చనలు
షట్సంపత్తియనగ శమదమాదిసాధనములచే
మిడిమిడి జ్ఞానమును బారదోలి
నియమిత నిష్ఠలమరినింకు శ్రద్ధతోన.

„రామ శ్రీరామ రామ” యను నామత్రయము క్రమముగ అ ఉమ్ వర్ణనముల దెల్పుచు నోంకారమయ్యె, గావున, నది మూర్తిత్రియ, గుణత్రియ, శక్తిత్రియ, సృష్టిస్థితిలయకారణత్రియములై, తురీయావస్థలో భిందునాద కళల నతిక్రమించి వెలయు సచ్చిదానంద రూపముననూ.

ముక్తిదాయియగుటవలన రామనామము తారకమంత్రరాజమయ్యె, దీని యభ్యాసమున సర్వదుఃఖభయములువీడిపోవు సత్యముగను మరి సంశయ రహితముగను.

రామస్వరూపము పంచమహాభూత పంచీకరణముకాదు, మరిచైతన్యము, శాంతాత్మ, సచ్చిదానందమయము, యవతరించె నిక్ష్వాకువంశమందు, చిచ్ఛక్తి సీతగాగ భూభారహరణార్థమై.

గుణమయమై, యవ్యక్తము అనాద్యవిద్య, పరమేశశక్తియని పేర్లు బడసిన మూలప్రకృతియొక్క గుణసమతావస్థయందుఁ బ్రతిబింబించిన బ్రహ్మము పరమేశ్వర నామమునొందె, యట్టి బ్రహ్మము యొక్క నిండు ప్రసన్నతను ప్రార్థించునట్టి "ఓం శ్రీ పరమేశ్వర సుప్రసన్నోభవ" యను రెండవ మంత్రముపదేశమయ్యె సకల శ్రేయోదాయకముగను.

ఈరెండు మంత్రములు సగుణ బ్రహ్మద్యోతకములయ్యె ధ్యాతృ, ధ్యాన, ధ్యేయవివక్షతలబట్టి కాన సేవించుచుంటి నిర్మల మనసుతోడఁ బ్రభుభృత్యన్యాయమునను.

నాకు శక్యమగునే కించజ్జుఁడనగుటచేసి, వీని సారము మరి మహిమ తెలియంగ, నైన వ్రాసితి నాదు శక్తికొలది, మహాత్ముల, దివ్యజ్ఞాన సంపన్నుల బోధలు బడఁయగోరి.

"బ్రహ్మవేదన మాత్రేణ బ్రహ్మాప్నోత్యేవమానవః" యను కఠోపనిషద్వాక్యము బోధించు బ్రహ్మధ్యాన మహిమ నిశ్చయముగ, భక్తుల కానందపూరితముగ, మరి "వేదన" బోధించు సంపూర్ణభక్తి జ్ఞానములరయ.

నిండు నిర్మల మనసుతో శిశువు తల్లి వశమై చంకచేరున ట్లుల, సర్వధర్మములను సంశయ విపర్యములతో విడచి, తన హృదయమునందు సదా భాసిల్లుచున్న సమష్టి ప్రత్యగాత్మ (పరమాత్మ)ను సర్వావస్థలయందు శరణు బొందుట సత్యమైన భక్తియగును.

శరణుబొందుటయనగ నవిద్యావృతమైన తన వ్యష్టి ప్రత్యగాత్మయనగ శబలజీవుని—చిదాభాసుని, సమష్టి ప్రత్యగాత్మ—ఈశ్వరుని—సాక్షిచైతన్యమునందు, దేశకాల నామరూపములను లీనముచేసి, బ్రహ్మమైయుండుట శరణమగును. మరియు నిది యాత్యంతిక భక్తి—ఆత్మార్పణయని చెప్పఁబడును.

ఇదియుగాక, సర్వావయవములు—జ్ఞానకర్మేంద్రియములు స్థూలశరీరము కర్మలకొరకేర్పడెనుగాన, జ్ఞానియైన నజ్ఞానియైన మనుజుఁడు సోమరితనమువిడచి, నిరతము చేయవలయు కర్మల "పరోపకారార్థ మిదం శరీర" మను వాక్యమునుబట్టి, ముఖ్యముగ నల్పుల క్షేమమరసి, "సర్వం ఖల్విదం బ్రహ్మ"—"తత్త్వమసి" యను మహావాక్యముల సారమును, నదియుఁగూడ భక్తియగుటవలన.

అంతఃకరణమునందు గాఢభక్తి విశ్వాసములు, మరి వైరాగ్యము, సత్యప్రవర్తనలేని వాని ప్రాభవము వ్యర్థమగును, జలములేని మేఘార్భాటము చందమునను.

ఐన యత్నించెద చిన్న గ్రంథము లిఖింప నాదు యనుభవములబట్టి, శ్రీ పరమేశ్వర శతకనామమున, "యత్రేశ క్తిశ్శధాతవచ" యని యిరువదియైదవ స్వప్నమందు శ్రీ భగవదాజ్ఞ ననుసరించి,







శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీ పరమేశ్వర శతకము.



1 ఓ పరమేశ్వరా! రామా! నిను సేవించుమనుజుని నీవనుగ్రహించుట సత్యమైనను, స్వకీయ యపరకీయ భేదమించుకయులేదు నీకు, భక్తి తారతమ్యముచే ఫలమునొందుట వింతకాదు లోకములోన.

2 మిథ్యాభక్తిచే నరుడు ఫలమునొంద మిసత్యముగాన, నవ్యాజకరుణతో నాకు నిండు భక్తినొసగి రక్షించుభారము నీదే యని ప్రార్థించెద నిండు వినయముతోడ.

3 షణ్మతములయందు నీవు సముండవై యున్నను, దేశకాలావస్థలచేఁ గలిగిన మతభేదములవలన, నిను గూర్చి తగవులఁబడుట మందబుద్ధిగాని, సత్యముగునే.

4 కపినిగాను మరి పామరుఁడగాని, నీదుసేవ నొకింత సేయు బుద్ధిగల్గుట నాదు పూర్వకర్మ ఫలముగాదె, దాని నుద్ధరించి వృద్ధిఁ జేయు భారమునీవు వహించినను రక్షింపుము నిరహేతుక కారుణ్యమునను.

5 విభ్రమమునుండి తొలగించి విశేషానుగ్రహమునఁ గాపాడు

నట్టి దైవము జగతిలోన నీవగాక మరి లేదులేదు త్రికాలములను.

6 వెంబడించియుండు నాశాపాశముల ద్రుంచి నీదు పాదారవిందముల బుద్ధినిలుచు మార్గము నీవు జూపవలయు, కానిచో, చపలచిత్తుఁడనైన నాకు సాధ్యమగునే.

7 కయ్యములాడుచు నాకంటె బుద్ధిమంతుఁడెవడని యుప్పొంగు నా నీచమనసు నిను జేరఁజాలునే యెన్నటికైన నీదు కరుణ లేక.

8 యమనియమముల నొనర్పలేను, మరి శాస్త్రవిధుల నడుపలేను, పశుప్రాయముగ సంచరింతు సర్వకాలములను, అట్టి నాయందు సంపూర్ణదయనుజూపి రక్షింపుము భూతదయేశా.

9 నిమిషకవియను పూర్వార్జితవంశనామము, వెంకయ్యయను వ్యావహారిక నామము పవిత్రముగుటకు నాదు దురితముల బారదోలి సదా నీ పాదసేవఁజేయ బుద్ధినొసగుము తండ్రి.

10 విద్యలేదు నీకథల వర్ణింప, స్థిరబుద్ధిలేదు నీ ధ్యానమొనర్ప, దేహపాటవములేదు నీనామ జపముసేయ, నిక నెటుల నిన్ను జేరుదు నీ భక్తవాత్సల్యమాత్రమున గాక.

11 నిను బేర్కొనినను, నీపేరు వినినను కలదు మోక్షంబు నెట్టి వానికైన, మిత్రలేని బాధలుతొలగిపోవు షండుఁడైన, మరి

పాషండుడైన, కఠినుఁడైన మరి కోపియైన, విటుఁడైన, మరెట్టి పాపియైన.

12 వెంగళితనమున నటుయిటుఁ దిరుగుచు, కయ్యములాడుచు కాంతలవెంటబోవుచు, యమభటునిబోలి చరించువాఁడైనను సద్గతిని బొందు నీనామస్మరణఁజేసిన మాత్రముననూ.

13 „ అతిపాపకర్ముఁడైనను సతతము నారాయణాఖ్యశబ్దము మదిలో వితతంబుగఁ బఠియించిన చతురుని గొనియాడ కమల సంభవు వశమే ” యను భాగవత వాక్యము సత్యము గాదె.

14 నిందలకులోనుగాక మిశ్రద్రవ్యముతో సంతుష్టినొంది యింతదనుకఁ గాలముగడుపుట నీ కరుణారసమహిమగాదె, నాదు పూర్వకర్మ భాగ్యవశముననూ.

15 నేను నూతఁబడినపుడు, మరి సరీసృపములు దారి నడ్డగించినపుడు కాచి రక్షించితివి తత్తత్కాలములను, గాన నీదు కరుణ కపారముగలదే !

16 నీవాదివిష్ణువయ్యు, కారణాంతరముచ నీ భూమియందు మానుషజన్మమొంది, శిష్టపరిపాలన దుష్టసంహారమొనర్చుట నీ యపారకరుణనుగాదె.

17 నీకు నిండుభక్తులు నారదాదిమునులు వేచి యుండిరి నీ రాకకు సర్వజీవ ముక్తిదాయివగుట జేసి.

18 మనుజుఁడు సేయు సర్వకర్మలనుఁ దన సహితముగఁ బర

మేశ్వరున కర్పణచేసి, యుదాసీనత సదా ధ్యానపరుఁడై యుండవలయు నితరచింత లేమియు లేక.

19 సర్వభూతములను సమముగఁ జూచుచు, ద్వేషమును దాని రూపుమాపి, సచ్చిదానందమూర్తియె సర్వమనుచు నింక తాదాత్మ్యబుద్ధితో నుండుట శ్రేయమగును.

20 స్వకర్మ పరిపాకవశమున మంచిచెడ్డలు గల్గునపుడు నొందఁ గూడదు హర్షవిషాదములను, మరి నుండవలయు సమబుద్ధితోడ.

21 భక్తియనగ సదసద్వివేకము, సర్వజీవసౌహార్దము, యాత్మ భేద నిరసనము, నిరతము శ్రీ పరమేశ్వర ధ్యానము, శక్తి కొలది ధర్మము పరమేశ్వరార్పణముగ, భూతదయయు స్వజనపరజన భేదరహితముగను.

22 జీవుల స్వతంత్రుల జ్ఞాననిమగ్నులు, భావికాలగతులరయఁజాలరిది మరచి, తాము సర్వజ్ఞులమనుచు గర్వితులగు టిహపర బాధకరముగాన విడువవలయునట్టి దుర్గతిహేతుబుద్ధి నన్ని విధములనూ.

23 కాయముక్షణభంగురము జలబుద్బుదమురీతి, వీడును తప్పక నిప్పుడైన నూరేండ్లకైన, నిదిమరువక మనుజుఁడు శ్రీహరి ధ్యానమొనర్పవలయు సర్వకాల సర్వావస్థలయందు.

24 స్వార్థమైన పరబ్రహ్మధ్యానమందుఁ బ్రమాదమునొందు మనుజుఁడుండునాయని శంకించిరి శ్రీ శంకరాచార్యస్వామి "వివేకచూడామణి" గ్రంథములోన.

25 కాయము క్షణభంగురమే కాక వ్యాధిపూరితము, క్షణికపరిణామము, దుర్మలరక్తమాంసోపేతము, ధాతుబద్ధము, సదా మలముల వెడలించు నవద్వారయుతము, గాన వలదు మమత్వబుద్ధిదీనియందు.

26 తనదియను పదార్థమించుకైన లేదు వ్యష్టిని జగతిలోన, సమష్టిని సర్వము తానై యుండు, మరి సర్వము తనయందుండు, గావున, వలదు వలదు దేహాభిమానము మరియు వస్తుకాంక్ష.

27 తాననుచుఁ బెక్కు స్వాభిమానములతో, పలువిధభోగములతోఁ బరిమళ ద్రివ్యలేపనలతోఁ బట్టుదుకూలధారణలతోఁ బెనిచిన దేహమైనఁ దన వెంటరాదు మరణకాలమునను, సుకృత దుష్కృతకార్యవాసనలు మాత్రము వెంట వచ్చు, నవి యంతఃకరణ పరిణామము లుత్తరగతికారణములగుటఁజేసి, మరియు మంచి చెడ్డలు చెప్పుకొనఁబడుచుండు జగతిలోన.

28 తల్లిదండ్రులు, పత్నీపుత్రాదులు సత్యమునఁ దనవారు కారు, పూర్వకర్మవశమునఁ బోషణార్థము సంతజనమురీతి చేరియుండురు నియతికాలముదనుక.

29 ఎట్లైన మానుష జన్మమునొందుట దుర్లభతరముగాన మనుజునకు జీవితకాలము వ్యర్థపుచ్చక దుఃఖతమమైన సంసారసముద్రము దాటవలయు నీ శరీర నావవిచ్ఛిన్నము కాక మునుపె.

30 తీర్థయాత్రలు విగ్రహారాధనలు పునర్జన్మ కారణములు, శ్రీహరి భజనము, సర్వజీవ సహోదరత్వబుద్ధి, ధర్మతపశ్శౌచము లాత్మార్పణమనునవి మోక్షహేతువులరయ.

31 ద్వైత విశిష్టాద్వైతాద్వైతములను మూడు మతములు వివరింపఁబడియె ముక్తికి శాస్త్రములందు, వాని వివరణమిచట నవసరము, కాని యద్వైతము మోక్షమునకుఁ బరమావధి యని భోధించు వేదములుపనిషత్తులు మరి పురాణములుగూడ.

32 ద్వైతవిశిష్టాద్వైతములు సగుణ బ్రహ్మబోధకములు, భక్తి తారతమ్యమునుబట్టి యర్చిరాదిమార్గముల సాలోక్య, సామీప్య, సారూప్య సాయుద్యపదవుల నొసగునని బోధించు.

33 అద్వైతము నిర్గుణ బ్రహ్మద్యోతకము, అపరోక్షజ్ఞానముచే జీవ బ్రహ్మైక్యసంధానము గావించు దేహపాతస్థలమందునని బోధించు.

34 భక్తి ముఖ్యసాధనము ముక్తికి యేమతముబట్టియైన, మరియు నాత్యంతిక భక్తి పరబ్రహ్మ తాదాత్మ్యముగాన నదియుఁ బరిణమించు నద్వైతముగను.

35 సముద్రము తరంగంబులగునటులఁ బరబ్రహ్మాంశలు జీవులగును, కాని సముద్రము తరంగ సంబంధమైనద కాని యటుల బ్రహ్మము జీవసంబంధి కాదని తెలియవలయు సంశయ రహితముగను.

36 శిశుపాల దంతవక్త్రులు దృష్టాంతముగాఁగ, స్నేహేతరమున శ్రీహరినిగూర్చి చేసిన దూషణయుఁగూడ మోక్షకారి యగును నిఁడు మనమునఁ జేయఁబడనేని, దూషణభూషణ తిరస్కారము లాత్మకు లేనికతమునను.

37 ఎవరికోతప్పలేదు నిజమైన భక్తి నిక్కలికాలమునను, కాని బహుజనము రామదాసులమనుచు సంచరించుచుండిరి కపటి వేషముల ధనార్జనకొఱకు.

38 గురువుల మనుచుఁ గొందరు మునివేషములదాల్చి, గుణము లందు వారికి సరియగు శిష్యులు వెంటరాగ ఁదరుగుచుండిరి దేశదేశములయందు ధనార్జనకొఱకై.

39 విచ్ఛిన్నములగుచున్నవి యాలయములు పూజలు తగ్గె విగ్రహములకు, మంత్రములురావు పూజారులకుఁ, జమవనోల్లరు సోమరితనమున, మరి యితర విషయ వాంఛలచేత.

40 నాబాల్యకాలమందహర్నిశము వేదాధ్యయనమునకుఁ బురాణముల గోష్టికిఁ బ్రసిద్ధినొందిన పవిత్రగృహములిపుడు పేకలాటలకు, వివిధ వ్యాపార కార్యాలోచనలకు స్థానములై మరింతపవిత్రములయ్యె.

41 ఏమిచెప్పగల నిప్పటి పాశ్చాత్యనాగరికత విశేషములగూర్చి, యెటుజూచినఁ బతులులేని బ్రాహ్మణస్త్రీలబోలి బోడి బుర్రలు, బూట్లు, కోట్లు, శిగరెట్లు, మరియు నాసికమునందు సులోచనము లాననముల కందమొసర్ప.

42 వదిలి వేసిరి బ్రాహ్మణులు (కొద్ది మినహాయింపులతో) సంధ్యా వందనములు, వేదోక్త సర్వబ్రాహ్మణ కృత్యము లింగ్లీషు విద్యాభ్యాస ప్రాభవముునను, పూర్వపద్ధతులు డాం నాన్ సెన్సు సూపర్ స్టిషన్సు యనుచు నింతకన్న మరేది వింత !

43 దేవుఁడు లేడు వేదములు పిచ్చివ్రాతలు, యజ్ఞోపవీతధారణ మపవిత్రము, శరీర భారకమనుచుఁ దీసివేయుచుండిరి కొందరు బ్రాహ్మణులు, కాని బ్రాహ్మణేతరులు కొందరు ధరించుచుండిరి తాముును బ్రాహ్మణులమనుచు.

44 కాఫీ, తేయాకు, సోడాబుడ్ల పానములు, యిడ్డెములు, ఉప్మా బిస్కెట్లు భక్షణములు వృద్ధియగుచున్నవి దినదినమునను, మరి యంతులేదు వీని పానములకు భక్షణలకు శుభకార్యములలోన.

45 పూర్వకాలమునుఁ బట్టణములకన్న నిండు పవిత్రప్రదేశములని ప్రసిద్ధినొందిన పల్లెటిగ్రామములిపుడు కలిమహారాజు గారికి చక్కని విహార ప్రదేశములయ్యె, గాన జారచోర మద్యపానాది వినోదములకు, కుట్రలకు, కూటసాక్ష్యము మొదలగు పలువిధకల్పనలకు, మరివ్యాజ్యములకు స్థానములై ప్రభవిల్లుచుండె.

46 సత్యము మరుభూములజొచ్చె, మరియు వేదశాస్త్ర పురాణేతిహాసాదిగ్రంథములయొక్క సారము చీట్లపేకాది యాటలందు జేరె సదా పెక్కు బ్రాహ్మణాది బృందములకద్వై

తానందమొనర్చు, కాని యస్పృశ్యత మాత్రము కుంటుకొ
నుచు వదలకున్నది బ్రాహ్మణనామము కాపాడునట్టి సరి
హద్దు కంచవలెను.

47 ఎట్టి దురాచారములు దుర్జడతలు ప్రబలిన కూడదనువారు
లేకుండిరి ప్రస్తుత పరిపాలన విధులకు వెరచి.

48 ఇక నెన్నివిచిత్రము లేర్పడునో, ప్రపంచమెటులఁ బరిణమిం
చునో నూహింపశక్యములేకుండె ప్రస్తుతపరిస్థితులబట్టి.

49 ఇప్పటి పాఠశాలలో నీతి మతబోధలు లేని కారణమున,
మతవిధులు దైవభక్తి విశేషములు తెలియక జనులు స్వేచ్ఛా
సంచారులైరి నిశ్చయముగను.

50 విద్యాధికారులు నియోగించిరి సులభమనుచు కుక్క నక్క
కాకి కథలఁ జెప్ప చిన్నబాలుర బడుల (Elementary
Schools) లోన దైవభక్తినీతిని బోధించునట్టి పూర్వపు బాల
రామాయణ దాశరథి శతకాది చిన్నగ్రంథముల విడిచి.

51 లేతకొమ్మ వంచబడు హానిలేక నేదిక్కుకైన నిండు సులభ
ముగను, అటుల దైవభక్తి నీతి సదాచారములు నేర్పవలయు
బాల్యమందు, కానిచో నవి యలవడుట దుర్లభము పిదప.

52 దీని యోచించరైరి విద్యాభివృద్ధి కేర్పడినవారు, కారణము
వారికె తెలియువలయు నిండుబుద్ధిశాలురు పండితులగుటవలన.

53 మతగురువులు తటస్థముగఁ జూచుచుండిరిట్టి దుస్థితుల తమకు

గాని యట్లు, మతములరక్షణ, సుస్థితులగూర్చి మతాధిపతులైనను, ప్రభుత్వమువారి యుదాసీనతవలన.

54 పాఠశాలలోఁ జదువు బాలురలో బెక్కండ్రు విద్యాభ్యాస శ్రద్ధలు లేక వ్యర్థపుచ్చుచుండిరి కాలము శరీరాలంకారముల, నాటకముల, పేకలాటల మరి వినోద సంభాషణలవలన.

55 ఇట్టి దురభ్యాసములను గమనించకుండిరి బాలుర యుక్తప్రవర్తనలకు, విద్యాభివృద్ధికి బాధ్యులైన తండ్రులు పోషకులాశ్చర్యముగను బుద్ధిమంతులగుచున్నారను నమ్మకమునను.

56 మనుజుని యుక్తప్రవర్తనలకు స్వభాష స్వమతబోధలుతో సరిరావితరమతబోధలు జన్మతఃకలిగినవి కానివగుటవలన.

57 అన్యభాష, అన్యమత విధులు మరి రహస్యములు స్వానుభవమునకు రాకను, మరి స్వమతవిధుల జ్ఞానమించుకయు లేక, పలువిధములు భ్రష్టులగుచుండిరి విద్యార్థులరయ.

58 „ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః ” యని గీతలలో శ్రీకృష్ణస్వామి చెప్పిన వాక్యము సత్యముగాదే.

59 తలిదండ్రుల యాబ్దికములైనఁ బెట్టకుండిరి కొందరిపుడు పూర్వాచారములు శాస్త్రవిధులు డాం నాన్ సెన్సు యనుచు.

60 భోక్తలరుదయ్యె యాబ్దికములకు నింగిలీషు విద్య నభ్యసించువారు నీచమనుచు, వచ్చువారధిక దక్షిణల బేరమాడుచుండిరి శంకలేక.

61 మరియుఁ గష్టకాలమందు సహాయ మొనర్చువారసలు లేరు, యిట్టి యోగ్యతలు, శాఖ కట్టడియేర్పడెను బ్రాహ్మణ శాఖలందు.

62 ఇకకొద్ది వత్సరములుగడచుసరికి యాబ్దికములుంచువారుండరు రూఢిగాను, నెవరైన నుంచఁదలచినచటకముల చేయవలసి యుండు, మరి శవముల మోతకు శకటము లాధారమగును నిశ్చయముగను.

63 మరియుఁ గొందరికి బ్రాహ్మణ నామము భారమయ్యె నంతరంగమందు, బైటకు మాత్రము చెప్పుట తప్పకుండె మారునామము లేని కతమున మరి గౌరవముకొరకు.

64 వేదవిహితమైన వృత్తులుకన్న నిందు మర్యాదగలవియనుచుఁ గొందరు బ్రాహ్మణు లవలంబించిరి కుట్రలను కూటసాక్ష్యములను.

65 తిట్టవచ్చు నన్నివాక్కులకు దూషణచేసినాననుచు, కాని తోటలో నొకచెట్టు పూచినఁ దోటపూచినదని, గ్రామములో నొక గృహము కాలిన గ్రామము కాలినదని చెప్పువాడుకరీతి, జాతిలో గొందరు దుశ్చరితులైన, జాతికి గల్గు దుర్యశస్సుగాన, నాదు దూషణచే నట్టి సోదరులు సుశీలు రయ్యెనేని, బ్రాహ్మణులు కౄరులనృతవాదులను నపయశస్సు తప్పునుగానఁ, జేసితి సత్యమైననింద.

66 మతసభ లుపన్యాసములును జరుగుచున్నవమితముగను,

కాని ప్రయోజనము లేకుండె దుష్కాలమగుటవలన, వాగ్వ్యయము తప్పు.

67 చదువవచ్చు నింగిలీషు ప్రకృత రాజభాషయగుటంజేసి, జీవనాధారము ప్రాభవములకొఱకు, దానినుంచి గర్వితులై సనాతనమత సాంప్రదాయముల విడిచి స్వేచ్ఛసంచారులు, కులభ్రష్టులగుట నిందార్హము, మరి నగుబాటుగాదె లోకములోన.

68 కొందరు మహనీయు లింగిలీషు విద్యావిశారదులయ్యు, సనాతనధర్మమార్గముల సంచరించుచుండిరి నిండు దైవభక్తిగలిగి, నక్షత్రములలోఁ జంద్రునివగిది కడు యశస్సుతోడ.

69 వారి సంఖ్య క్రమముగఁ దగ్గుచున్నది బహుళ పక్ష చంద్ర కిరణములభంగి, కొలది వత్సరములు గడచునరికి, వేదాభ్యాస శూన్యమై యమావాస్యరాత్రి సరణి, గాఢతమస్సు వ్యాపించు చిరకాలము సంపూర్ణనాగరికతకు, దైవభక్తికి, విద్యలకు, సర్వసంపదలకుఁ బ్రసిద్ధిగాంచిన హిందూదేశజనుల మనములందు.

70 కుతర్కములవీడి మహోత్కృష్టమైన వేదవిహిత మార్గముల సంచరింపవలయు, లేనిచోఁ గాలక్రమమున దైవభక్తి నశించు మరి యిడుములు సంభవించు దత్కారణమునను.

71 సకల శ్రేయస్సులకు మూలము దైవభక్తి, సుశీలత, యన్యోన్యమైత్రి, విడువదగదు వీని నెట్టి సమయములను, లాభాలాభములు జయాపజయములు దైవపరముఁజేసి.

72 మహనీయులు మహాకవులు, రాజకార్యధురీణులు, స్వమత గ్రంథములును చేయు సద్బోధలు నిందు శ్రేయోదాయకములు, వానిమరువఁగూడదు సర్వకాల సర్వావస్థలయందు.

73 ఘనులు మన పూర్వులు రచించిన గ్రంథములనంతములు సంస్కృతాది భాషల విద్యాశాఖలందు, వానిఁ జదువుచు వినుచు నుండవలయు వారి సంతతి వారమగుటవలన, విడువఁగూడదు వారి శిష్టాచారములను ధర్మవిధులను మరియు దేశభాషాభిమానులమయ్యేనేని, వారి సచ్చరిత్రలు మనకు మార్గదర్శకములు కావే.

74 పరికించి చూచిన నంతఃకలహములకంటెఁ గానరాదు గొప్ప యాపద కుటుంబములలోన, శాఖలలోన, దేశజనులలోన, మరి రాజకీయ స్థానములయందు.

75 ,,పోరునష్టము పొందులాభమను" లోకసామెత తారాకాణముగ, మహాభారతయుద్ధకాలమునుండి, పలువిధకారణములవలన నంతఃకలహములు, కుటిలు ప్రబలి క్రమముగ స్వేచ్ఛనశించి, యవయవములు మనస్సు బంధింపంబడి, కారాగారములసాటి శరీరములతో మిగుల హీనస్థితి, బానిసత్వములకు లోనైనను, నీటికాకి నెపముల హిందూమహమ్మదీయులును, గొప్పకొద్ది శాఖలనుచు హిందువులలోను పోరాడుచుండిరి ఘోరముగను, మరియుఁ గొన్నికోట్ల హిందువులు మతాంతరులై వారి జనసంఖ్యయు బలము తగ్గి క్రమముగ దేశము కడు దుస్థితికివచ్చుచున్నను విడుచుట

లేనివాని, నింతకన్న శోచనీయమైన యంశము, దేశారిష్ట కారణమేది తలప.

76 లోకవ్యవహార సౌష్టవముకొరకు నేర్పడినవి యాదికాలమున, బ్రాహ్మణాది నాల్గువర్ణములు, వాని శాఖలు, గొప్ప కొద్దులు, ఘనతనీచత్వములు లేవు వానిలోన, కలవని యెంచుట దురభిమానముగాక సత్యమగునే.

77 శూద్రనామము నీచమనుచుఁ దలచుచుండిరి కొందరు ప్రకృతమందదియు సరికాదు, శూద్రశబ్దము సర్వప్రాణుల జీవనము మరి సౌఖ్యహేతువులైన పలువిధ కార్మిక కర్మలనొనర్చు జనసముదాయనామమగుటఁజేసి.

78 పాదములు, తొడలు లేకుండ నేజంతువైన నడువగల్గునే, భుజములు చేతులులేనిచో కర్మలనొనర్చు సాధనములెవ్వి భువిలోన, యటులనే శిరములేకుండిన వీని నడుపు మనోబుద్ధుల కాస్పదమేది తలప.

79 శిరము, భుజములు, తొడలు, పాదములు సౌఖ్యముగ జీవించుట కాధారమగునటుల, నాల్గువర్ణములు పరస్పర సహాయమువలన సౌఖ్యహేతువులయ్యె మనుజులకు సర్వదేశముల యందు, గాన నీచమెద్ది వర్ణములలోన మరియు శాఖలలోన.

80 సానిభోగముల శాఖలు నీచమనుచుఁ దలచుచుండిరి కొందరిపుడు, నదియు సరికాదు, పరదేశీయులకు వంటపూటి

గృహాములవసరములగునటుల నివియు నవసరమయ్యె, కాని వారు స్వేఛ్ఛసంచారము వదలి, వివాహితులై గృహస్థధర్మ మున నుండవచ్చు నిర్భయముగను శాస్త్రసమ్మతముగను.

81 సర్వమతములకు శాఖలకు జీవనాధార వృత్తుల నేర్పరచు నపుడు, గానవిద్య సానిభోగములవారి కేర్పరచబడియె, సర్వ జనుల కాహ్లాద మొసర్ప, మరియు నట్టి విద్య వృద్ధినొంద.

82 పరికించి చూచిన నీచకులము నీచవృత్తిలేదు జగతిలోన, సకలవృత్తులు, శాఖలు, సర్వకర్మలు విధిగ నుండవలసినవి యగుటఁ జేసి.

83 ప్రకృతమందుఁ గొందరగ్రశాఖలవారును, యల్పశాఖలవా రును, మంచి యౌవ్వనము శరీరదారుఢ్యత గల్గియుండియు, వారికి నియమిత పనులవిడచి, సోమరితనమున ముష్టివృత్తి జీవనాధారముగ నేర్పరుచుకొని పీడించుచుండిరి జనుల, దేశ దుస్థితి వృద్ధినొంద.

84 ఇదియొకటితప్ప, లేదులేదు నీచవృత్తి నీచసాఖ భువిలోనమరి దారిద్ర్యము భాగ్యవంతులకు నంజనమువంటిదిగాన, నదియు ప్రపంచ వర్తనకు ముఖ్యమయ్యె.

85 సర్వమతములను, శాఖలను వాని నామములను నేర్పరచిన మతకర్తలు—ఋషులు మునులు సర్వాసములు, దివ్యజ్ఞాన సంపన్నులుగాన సర్వజన సౌఖ్య శ్రేయోభివృద్ధి కోర్కెలు తప్ప, లేవు వారికి కలుషబుద్ధులరయ.

86 విదేశ పాలనావశమున "విభజించి పరిపాలించు" మను రాజనీతి వచనములఁబట్టి, బోధించుచుండిరి స్వలాభపరులు, శూద్రి శాఖలలోఁ గొన్ని నామములు నీచమనుచు, జనులలో నంతఃకలహములు, కుట్రలు వృద్ధినొందఁ గోరెక్కతోడ.

87 సర్వమతముల, శాఖలవారు దేశాభివృద్ధి హేతుభూతములైన సంఘకార్యములం దేకమనస్కులై యుండవలయు, కానిచోఁ గార్యభంగమునగూర్తురు శాత్రవులు పలువిధములను స్వలాభపరులగుచు.

88 ఏకమై యద్వితీయమై సర్వోపాధిగతమై సర్వసాక్షియైన నాత్మను ధ్యానించుటమాని, అంతఃకలహములే సత్యములు శ్రేయోదాయకములనుచు, జీవితకాలము వ్యర్థపుచ్చుట కంటే నీచముగలదె జగతిలోన.

89 ఆత్మ జడపదార్థములయ్యె సృష్టిక్రమములోన, మరి జడపదార్థములాత్మయయ్యె లయకాలమునను, గాన సర్వజీవులు పదార్థములు యొకటియైన నాత్మయేగాని వేరుయనగ రెండు కానియటుల, సర్వమతములు శాఖలు విరాట్పురుషుని శరీరమయ్యె, గాన వలదువలదు భేదబుద్ధి మరి పోరాటములు వీనిలోన, నిహ పరసౌఖ్య హానికరములగుటఁ జేసి.

90 ఆహారము ముఖ్యము సర్వప్రాణులకు, దాని కొరకారంభమయ్యె పోరాటములు జంతువర్గములోన, మరియు వృద్ధినొందె మానవజాతియందు,ధనికులు యధికారపురుషులు (గీతల 13

అధ్యాయములో (శ్రీకృష్ణస్వామి చెప్పినట్లు) ధనమా ర్జించి బీదలకు జీవనాధారముల నేర్పరచవలె కారణమునవరూ.

91 అట్టివారికి లేకుండె తామును బీదజనులు నొకయాత్మ స్వరూపములను విజ్ఞానమరయ.

92 విదేశపాలనావశమున సముద్రావలి దేశములనుండి దిగుమ తులగుచున్నవి వస్త్రాది సకల కార్మిక సరుకుల్లు, దానివలన పూర్వపు కార్మిక పనులు నశించి కోట్లకొలది జనులన్నాతు రులై క్షోభిల్లుచుండిరి దిక్కులేక.

93 నా బాల్యకాలమునం గూలీలు సులభముగ నాదుమళ్లు బరు వుగల కావిళ్లను మోయుచు 20 మైళ్ల దూరము వెళ్లేవారు మధ్య మజిలీలేక, యట్టి శక్తి క్రమముగ క్షీణించి యిప్పుడు విడిగనైన నడువలేకుండిరి కడుపునిండ తిండిలేక.

94 కొంతవరకైన జనుల బాధలు తగ్గింప సమర్థతగల మహారా జులు, రాజులు, జమీన్‌దారులు, గొప్ప ధనవంతులు, మరి పట్టణములలోన పల్లెలలోన పెద్దలు (Leaders) చూచు చుండిరి యిట్టి దుస్థితిని తటస్థముగను, పూర్వమువలె కర్మా గారముల తిరుగ నేర్పరచి, వృద్ధిపరచిన, దేశము సుస్థితికి వచ్చు, బీదజనుల సంతుష్టివలన వివిధమైన ఘోరకృత్యములు తగ్గు నిశ్చయముగను, ధనము నిలుచును దేశములోన, మరి జనులుగూడ నీ యుద్యమమునకుం దోడ్పడి విదేశ సరుకులం గొనుటమాని, స్వదేశసరకులం గొనవలయు విధాయకము గను, మరి నిండు సంతోషముగను.

95 ఇంగిలీషు భాషాజ్ఞానము వృద్ధినొందుటకు ప్రభుత్వమువారే ర్పరచిన పాఠశాలలోఁ జదివి, గొప్ప పరీక్షలలో నుత్తీర్ణులైనవారు పెక్కండ్రు జీవనాధారములేకను, విద్యాభ్యాసము కొరకు వ్యయపరచిన సొమ్ము వడ్డీనైన నిచ్చుకొనలేకను బాధపడుచుండిరి నిక్కాలముననుఁ, విశేషించి వారు వ్రాత పనులకేగాక మరెట్టిపనినిఁ జేయజాలకుండిరి మిక్కిలి దుర్బల శరీరులు, కాయకష్టముల నెరుగని వారగుటవలన.

96 స్వంతదేశవర్తకము, మరి కార్మికపనులు తగ్గునను భీతివలన విదేశపరిపాలకులు కర్మాగారముల నేర్పరచకుండిరి యీదేశ ములోన „ రాజులు చోరప్రాయులై సంచరింతు" రను భాగ వతవచనము సత్యముకాగ.

97 ఎట్టి హీర్షలులేవు వృక్షవర్గములోన, పలువిధ మొక్కలు పెరుగు నొక స్థలమునందు నన్యోన్యమిత్రత్వమున, పెరుగు టలో నొకదానినుండి రెండవది తప్పుకొనుచు, మరి తీగెలు ప్రాకును పెద్ద వృక్షములమీద.

98 ఇకనైన జనులన్యోన్య కలహములుమాని నిండు దేశాభి మానము సౌహార్దము, మరియు నద్వైతమతము బోధించు నిండు సోదర భావముగల్గి సంచరించవేడెద నిహపర సౌఖ్య దాయకములగుటవలన.

99 నాబాల్యకాలమున దేవోత్సవములకుఁ బంచములు తప్ప సర్వజనులు విచ్చేసి, యుత్సవము పూర్తియైనఁబిదప ప్రసా దము స్వీకరించి వెడలుచుండిరి. మరియు బ్రాహ్మణులు

విగ్రహములనొద్ద వేదబుక్కులు చెప్పుచుఁ దిరుగ స్వామి యాలయమునకు రాగ మంత్రపుష్పాదిక్రియలొనర్చి వెళ్లుట యాచారమైయుండె.

ఇపుడు స్వామి యుత్సవములలో వాహనముల మోయుఁ గూలీలు పూజారితప్ప, చేరువారొకరైన లేరు వట్టుపెట్టినట్లు.

మునుపటి యట్లు చేయుటకు భక్తి మరి యోపికలు లేవు జనులకిపుడు, చుట్టలు కాల్చు, వ్యర్థసంభాషణలవలనఁ గాలము గడిపెదరు కొందరు, మరికొందరు జూదముల, పేకలాటల, వినోద సంభాషణల ముఖ్యముగ బ్రాహ్మణకులము వారు.

ఇటులఁ బూర్వాచారములన్నియు మారిపోయె, యాయువ ల్పమయ్యె, దూరదృష్టి క్షీణించె, వేదవిహితకర్మలు ధర్మములు నశించె, మరియు రోగములు, జారచోరసంఖ్యలధికమయ్యె, పన్నులు నిర్భరములయ్యె, అధికారబాధల కంతు లేకుండె, జనులు నానాటికి బీదలగుచుండిరి, భావికాలగతు లెట్లుండునో నూహింపలేని దుస్థితినిఁ జెందె దేశము విదేశ రాజపాలన, భాషాభ్యాసల హేతువగను.

103 మరియుఁ బాడిపంటలుతగ్గె, భూమి యోషధులు నిస్సారమయ్యె "నిస్సారాస్పృడపీనిరౌషధ్యస్తా నీచామహాత్మ్యం గతాః" యను సామెత సత్యమయ్యె, శాంతితగ్గె, జనుల లోన నంతఃకలహము లీర్ష్యలు, కుట్రలు వివాదలు, దురాశ లధికమగుచుండె దినదినమునను.

109 వాత పైత్య శ్లేష్మముల విషమగతిచే దేహమున కనారో
గ్యము గల్గురీతి, రజస్తమోగుణము లుద్రేకమునను చిత్తము
చలించు శ్రీహరి ధ్యానమందు, భక్తియును తగ్గు తత్కా
రణమునను, కానభక్తులు దినవలయు సదా సాత్వికాహా
రము, కామోద్రేక పదార్థముల విడిచి.

110 కల్లు సారాయి, మరితర మైకపు పదార్థములు చెరుచు బుద్ధి
భక్షణానంతరమున, స్త్రీ స్వరూపము చెరుచు దర్శన
మాత్రమునను, గాన భక్తులు జాగరూకులై మెలగవలయు
ననివార్యమైన స్వభార్యేతర స్త్రీల సమావేశ కాలముల
యందు.

111 మితము మంచిది యాహార విహారములయందు, నతివ్యాప్తి
కూడ దెప్పటికిని, గాన మనుజుఁడు సదా జాగరూకుఁడై
సంచరించవలయు సర్వకాల సర్వావస్థలయందు.

112 తల్లివంటిది భక్తి సర్వవిధములను, తొలగించు నాపద లిహ
మునందు, మరియు మోక్షమునగు దేహనాశమున, గాన
భక్తులు నమ్మి భజించి రేని సకల శ్రేయములనొందుదురన్ని
సమయములనూ.

113 అనిశము గురువుల వలన నీ కథాశ్రవణము, నిండు శ్రద్ధతో
నీ నామస్మరణము, బాహ్యమున నంతరంగమున సర్వకలుష
రహితముగ నీ పాదసేవ, మరి హెచ్చుగ నీ భక్తుల పాద
సేవ భక్తి విశేషములరయ.

114 స్వరణయన మనసు వేరుగనుండఁ బెదవులతో నీ నామము చ్చరించుటఁగాదు, యంతరంగమున మనసు నీయందు నిల్పి త్రిపుటి యుక్తలేక త్రిపుటి రహితముగఁ జేయవలయు నొంటరిగ నేకాంతస్థలమునందు.

115 మరితరవేళల నీ సఖులతోఁగూడి ముచ్చటించవలయు నీ విభూతులను గూర్చి యన్యోన్య ప్రబోధముగలుగునటుల.

116 యుద్ధరంగమున నీవర్జునున కానతిచ్చిన ,, తద్బుద్ధయస్త్ర దాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః " యను వచనముల సారము గ్రహించి నడుపవలయు భక్తియోగము ఫలకోర్కె విడిచి సమచిత్తములో.

117 భక్తుల మనస్సు సుస్థిరమగుటకుఁ దొలుతవారికి కష్టముల నొసగూర్చుదువు, తుదకు రక్షించెదవు తప్పక నీదాసు గోపన్న మరి యనేకులు దృష్టాంతముగను.

118 స్వప్రయత్నములు మాని భక్తులు పూర్తిగ నీ శరణుఁ జొచ్చి యాత్మార్పణ చేయుదనుక నూరకుందువు మొరవిన నియట్లు, నీవేగతియని నమ్మి నిండు బుద్ధితోఁ బ్రార్థించిన తత్క్షణమున రక్షించెదవు ద్రౌపది దృష్టాంతము వస్త్రహరణకాలమునను.

119 నినుబేర్కొని మొరవిడువరకు నూరకుందువు నిన్ను గాని యటుల, నీపేరు నుడివి రక్షణవేడిన రక్షించెద వాక్షణంబ గజేంద్రునిభంగిని.

120 రక్షణకు నిను ప్రార్థించఁ దెలియని వారలనప్రార్థితుఁడవై కాచి రక్షింతువు జాగుసేయక తత్కాలమున, నిందుకు నేనదృష్టాంతము నాబాల్యమం దెవరికిఁ దెలియక నూతఁబడిన కాలముననూ.

121 ప్రారబ్ధవశమునగల్గు సుఖదుఃఖములయ్యె కాలములను, మరియు "దైవంమానుష రూపేణ" యను న్యాయమున నీవలనఁ బ్రేరితులై యితరులు నివారింతురట్టి యాపదలనుండి.

122 స్థూలసృష్టికి నీవు ప్రభుండవు, రక్షకుఁడగుటవలనఁ గాచి యుందువు జీవులను పదార్థముల నెపుడందువలన నిజ్జగతి జరుగుచున్నది సుస్థిరముగను.

123 సుఖఃదుఖములకు శీతోష్ణములకు, హర్షవిషాదుల నొందును వాడు నీభక్తుఁడుకాడు, వానివిడిచి నీ పాదారవిందముల నేకాగ్రత నిలుచుదనుక.

124 సకలమైన కోర్కెలు వీడి చిత్తము సుస్థిరముగనిందు ప్రేమా తిశయమున నీధ్యానమందు నిల్పుట భక్తియగును, మరియు నది త్రిపుటిరహితమయ్యెనేని సమాధియనబరగు.

125 వత్తి చమురు ప్రమిదేకమైయుండిన, నగ్ని స్పర్శవలన దీపమై కాంతినిచ్చుకరణి, కరణత్రియము నేకతనొందించి చేయవ లయు భక్తి సమబుద్ధితోడ.

126 మరియు వత్తి చమురు ప్రమిద కలియకనుండిన, నగ్ని స్పర్శ వలనఁ బ్రయోజనము లేనియటుల, కరణత్రియమేకముగాని భక్తి నిష్ప్రయోజకమగు నిశ్చయముగను.

127 «కరణత్రియంబుచే నరుఁడేకర్మంబు సేయునయ్యేవేళఁ హరికర్పణమని పల్కుటఁ బరువడి సుజ్ఞానమందు పరమ మునీంద్రుల్» యను భాగవతవచనము ప్రమాణమరయ.

123 స్వప్రయత్నము, శ్రద్ధ, సజ్జనసేవవలన చిత్తశాంతిగల్గు, భక్తి బీజము నాటుకొనును యంతఃకరణమందు, నదియుఁ గ్రమ ముగ వృక్షమై ఫలమునిచ్చు.

129 జ్ఞాన భక్తి మార్గములలో భక్తిమార్గము సులభమనుచు నుపనిషత్తులు, భగవద్గీతలు చెప్పుచున్నవి నిస్సంశయముగను గాన ముముక్షువులు సగుణభక్తి ప్రారంభించవలయుఁ దొలుత, మరియునది నిశ్చలచిత్తముతో నఖండముగఁ జేయబడెనేని త్రిపుటి రహితమై నిర్గుణధ్యానమగును.

130 ఘనకుటుంబములలోనజన్మము, విద్యాధనాకారములు ముక్తి హేతువులు కావు భక్తిలేక, మరియు నవిలేని యంత్యవర్ణ మందు జన్మించిన మనుజుఁడు ముక్తి భాగుడగును భక్తివలన.

131 విద్యయనగ నేదైన భాషను చదువుట, వ్రాయుట, శబ్దార్ధ ములుచెప్పుట మాత్రమెకాదు, యెట్టిపనినైనను సూక్ష్మబుద్ధి, కుశలత, మరి నేర్పుతోఁ జేయుశక్తి గూడ విద్యయగును, మరి నదియు ఫలకాంక్షలేక పరమేశ్వరార్పణముగ నిర్మల మనసుతోఁ జేయఁబడునేని, మోక్షకారియగును, కర్త్వకా రయి తృత్వభావము విడుచుటవలన.

132 విద్యలేని స్త్రీలు శూద్రులు మరి పంచములు చేయుదురు

హరిభజనలు నిండు నిర్మల మనసుతోడ, నట్టివారిని మూఢు లనుటఁ దగదు విద్యావంతులకు, జ్ఞానులమని గర్వించు వారికిని.

133 సర్వదేహములందు వసించుఁ బరమాత్మయంశరూపముననను, జ్ఞానియెవరో యజ్ఞానియెవరో, భక్తుఁడెవరో, కాని వాడెవరో తెలియఁజాలరు, కానఁ జేయరాదట్టి వివక్షతల నెపుడు.

134 రామ! సముఁడవై యుందువు సకల జీవులయందు, హెచ్చు తగ్గులు లేక జాతిమతవివక్షఁ బట్టి, గాన వీనిగూర్చి పోరాటములు వలదు వలదెన్నటికిని.

135 దుర్లభంబైన మానుషజన్మము పుణ్యపాపమిశ్రితము, వగవఁగూడదు సుఖదుఃఖములకు, మరియుఁ బ్రార్థించవలయు శ్రీహరినిగూర్చి యట్టివి ప్రాప్తించుతరిని.

136 అన్నిమతములకు శాఖలకు రామ! నీవయె యధిష్ఠానముఁ, పరబ్రహ్మ, వివిధదేవులు లేరే కాలముననను, దేశభాషాదిభేదములచే గల్గినఁ బలునామములబట్టి గొప్పకొద్ది మతములనుచుఁ బరమాత్మభేదము చెప్పవలదెన్నటికిని.

137 సకల శ్రేయోమూలమాత్మజ్ఞానము, ఆత్మరతి, ఆత్మక్రీడ, ఆత్మకానిది పరమాణువైన లేదు జగతిలోన, గాన భక్తులాత్మజ్ఞానము బడయవలయు ముక్తికొరకు.

138 "జగత్సర్వంశరీరంతే" యను వాక్యసారముగ నీవు జగత్స్వరూపుఁడవు, జగము నీ ప్రతీకముగాన భక్తులేది చూచిన వినిన నిన్న భావింపవలయు.

139 కించిజ్ఞుఁడు, మరి యవిద్యానిమగ్నుఁడు, దీనుఁడైన మనుజుఁ డేమిచేయఁగలడు, నీదు ప్రేరణలేనిచో సర్వయత్నములు వ్యర్థమైపోవు శాంతికలుగదు చిత్తమునకు.

140 నీకృపకుఁ బాత్రుఁడైన భక్తుని హృదయానువర్తివై జ్ఞానదీపమొసగి, యవివేకమను నంధకారము నశింపుచేయుదునని గీతలలో నీవర్జుననకుఁ జేసినఁ బ్రతిజ్ఞను నీ శరణుజొచ్చిన నాయందనుగ్రహింపఁ బ్రార్థించెద నిండు వినయముననూ.

141 భక్తుఁడు విశుద్ధచిత్తముతో మర్కట కిశోరన్యాయమున నిన్నాశ్రయించవలయుఁ గాని చపలచిత్తుఁడనైన నాకది యసాధ్యము గాననీవ ననురక్షించవలయు మార్జాల కిశోర న్యాయమునను.

142 "మచ్చిత్తామద్గత ప్రాణాబోధ యంతః పరస్పరం" యను గీతావచన సారమున, నాచిత్తము సదా నీ కథలవినుచుఁ బాడుచు, నొకరికొకరు నీ గుణానుభవ ప్రబోధము చేసుకొనుచు, నీ పాదారవింద ధ్యానమందుఁ జంచల రహితమై నిలుచు నట్లనుగ్రహింపుము దేవా.

143 నవవిధ భక్తిమార్గములలోఁ గడపటి "యాత్మనివేదనము ముఖ్యము. తక్కిన శ్రవణాది యెనిమిది దాని యంగములు—సోపానములు. మరి యాత్మనివేదము, "మామేకం శరణంవ్రజ" యని గీతల పదునెనిమిదవ యధ్యాయములో శ్రీకృష్ణస్వామి చేసిన కడపటి యుపదేశము యొక్క తేటయని దలచెద నిస్సంశయముగను.

144 ఓ రామ! నీవు నిస్సంగుఁడవు, నిర్వికారివి, గుణాతీతుఁడవు, యోగనిద్రాపరుఁడవయ్యు, భూతదయాపరతను నాయెడల మేల్కాంచి, నీదు పరిపూర్ణభక్తులలో నొకనిఁగఁ జేర్చుకొనుము, పరమ దయానిధివగుటఁ జేసి.

145 ,,బుద్ధియును మనంబు నినుఁబొరయునట్టిభక్తి యొసగుముజలధిశయన, పూర్వకర్మఫలంబులుపొందుగాకనవి రుణంబులు కడతేరునై సుఖింతు" నను భాగవత వాక్యము సత్యముగాఁగ.

146 మరియు నీవు సీతతోడ నాంజనేయాదియంగములతోడ నాదు హృదయమున వసించి నీదు స్మరణము విజ్ఞానమొసగుము నడుచునపుడు కూర్చుండునపుడు మరి యంత్యకాలమునను.

147 సీతతో సఖ్యము సుగ్రీవునకు సంశయరహితమై వృద్ధినొంద, నొకబాణమున సప్తతాళవృక్షముల ఖండించినటుల, నతి పవిత్రమైన మనమున నీశరణు జొచ్చి యాత్మార్పణఁజేయకునికి కారణములైన నాదు మలినమనో, బుద్ధి, చిత్తా, హంకార, సంశయ, విపర్యయ, హీనశ్రద్ధలను సప్తకమును దుంచి రక్షింపవేడెద శీఘ్రముగను.

148 ,, పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే, పూర్ణ స్యపూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే" యను వేదవచనసారమున, నీవు సదా పూర్ణుఁడవు, గాన భక్తులకు లేదనుమానము పూర్ణత్వసిద్ధికొరకు.

149 "తదిదం బ్రహ్మ సర్వమిదం బ్రహ్మ" యను నుపనిష
ద్వాక్యములు ప్రమాణములుకాఁగ, విశ్వములో దృశ్యమ
గునట్టి కానట్టి పదార్థజాతమంతయు విశ్వసహితము బ్ర
హ్మము—కారణరహిత కారణముగానఁ, బోధించవలయు
వాని బ్రహ్మప్రతీకముగనూ.

150 మరి ధ్యానము నిర్మలమనసుతో నఖండముగఁ జేయఁబడిన
సంప్రజ్ఞాతయనగ సవికల్ప సమాధియు, త్రిపుటి రహితముగ
ధ్యాతృధ్యేయాకారమునొందినపుడసంప్రజ్ఞాత యనగ నిర్వి
కల్ప సమాధియగును.

151 మనోబుద్ధులన వ్యభిచారగతిని నీయందు నిలుపు శక్తి ధ్యా
నమగును, యట్టి శక్తి సదా నాకొసగి రక్షింపుము దేవా.

152 వలదు సంతుష్టి సత్ప్రవర్తన, సద్గోష్ఠి, శ్రీహరి భక్తి ధ్యాన
ములయందు, వలదసంతుష్టి లౌకిక వ్యవహారములయందు,
మరియు సంచరించవలయుఁ దనవలన నితరజీవులకు, వాని
వలనఁ దనకు భయప్రమాదములు లేకుండునటుల.

153 వివేకం పరమాశ్రిత్య, బుధ్యాసత్యమ వేత్య్యచ, ఇంద్రియా
రీనలంఘిత్వా తీర్ణోభవ భవార్ణవాత్ యను మహోపనిష
ద్వాక్యమునుబట్టి మనుజులకు బుద్ధి స్వాతంత్ర్యమునగబడె,
గాన మనుజులు దాని సరిగ నుపయోగించి మెలగవలయు
సర్వ వైదిక లౌకిక కార్యములయందు.

154 ద్వివిధమైన పరిశుద్ధ మలినమనస్సులు మిళితమైయుండుట
సత్యమైనను, వివేకబుద్ధి నాశ్రయించి, మంచిచెడ్డల వివక్ష

చేసి, మలినవృత్తులను వాని కార్యముల నణచవలయు రాజ హంస పాలనీర న్యాయముననూ.

155 వజ్రము వజ్రముచే ఖండించఁబడునటుల, మలినమనస్సును మనస్సుచే నిరోధింపవలయు మూరుసాధనములేని కారణ మునను.

156 ఓ పరమేశ్వరా! జగదీశ్వరా! పరమపురుషా! పురుషో త్తమా! సృష్ట్యాదియందు నీకు గల్గిన యనంతనామములలో రామనామము మిగుల పవిత్రమై, నిరంతర మమృతరసము వర్షించునదియగుటవలన, దశరధపుత్రుఁడవై నీవవతరించిన పుడు, పురాతన రామనామము నీకిడెను వసిష్టఋషి సర్వప్రా ణుల భుక్తిముక్తి మరి శ్రేయోదాయివగుటఁ జేసి.

157 ఎట్టి పాపియైన నొకమారు నీనామోచ్చారణ మాత్రమున, దురితదూరుఁడగును శంకలేక, చెప్పసాధ్యమగునే నిరతము నిండు పవిత్రమనసుతో నీసేవ సేయువాని సద్గతినిగూర్చి.

158 నామరూపములు, దేశకాలములు మాయాకార్యములగుటఁ జేసి నామరూప రహితుఁడవయ్యు, బ్రోచుచుందువు భక్తులు నిను ప్రార్థించు రూపముననూ.

159 కల్లభక్తునకుగల్గు గర్వము, డంబము, దర్పము, ప్రకటించు వేషభాషలఁ దాను భక్తుఁడనటంచు జనుల పొగడి కవశ్యత లనుగోరి.

160 నిజమైన భక్తుఁడు తన భక్తి మరుగుపరచి సంచరించు వెర్రి వానివగిది జనులు నవ్వంగ, పరిహాసములుసేయ, మరి నిండు పవిత్రితను నిరతము నిల్పు మనము నీపాద పద్మముల, ధ్యానమొనర్చు నేకాంతముగ రాత్రిలందు విజన స్థలములందు.

161 నిండు భక్తి వైరాగ్యములు రెండు బాహువులు సంసార సాగర తరణమునకు, శ్రద్ధవలనగల్గు భక్తి, వైరాగ్యమువలన తొలగిపోవు దేహాభిమానము మరి వస్త్రకాంక్ష, దీని విర ళించి చెప్పె శ్రీకృష్ణస్వామి గోపీవస్త్రాపహరణమందు.

162 ముక్తిదాయియగు నాత్మజ్ఞానమను మడివస్త్రము ధరించు కొరకు, వైరాగ్యమను తడివస్త్రము ధరించవలయు ముందు గాను నిర్మలమనసుతోడ, సంసారవాసనలచే నిబిడీకృతమై యున్న మలినవస్త్రము విడచి.

163 వివరించితి క్లిష్టముగ బాలుర యుపయోగమునకు జ్ఞాన, భక్తి, నీతి వైరాగ్యమార్గముల నాయనుభవములబట్టి సుల భముగను, పాండిత్యము లేమిచే తెలియదయ్యె గణయతి ప్రాసలు మరి శాస్త్రవిధులు, తప్పుల క్షమించి యొప్పుల గ్రహించవేడెద కడు వినయమునను.

మంగళము శ్రీ సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న సమేత శ్రీరా ములకు, మంగళము సకల దుష్టరాక్షసులనగ దుష్టవృత్తుల, దుష్ట సంకల్పముల దుష్టబుద్ధుల, దుష్టవాసనల హరించువానికి, భక్తవత్స లునకు మంగళము ముమ్మాటికి శ్రీరామచంద్రునకూ.

శ్రీ పరమేశ్వర శతకము.

అర్పించితి నీకృతి శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న సమేత శ్రీరామపరబ్రహ్మకు, విభవసంవత్సర మార్గశిర శుద్ధ ద[illegible]రాత్రి (22-12-1928) భక్తుల భజనయందు.

సమాప్తము.




పి. వి. రంగారావుగారి రం